# క్రీస్తుజనన నాటకము

కర్నూలుజిల్లా కంభంతాలూకా గోపానిపల్లె

గ్రామకాపురస్థులును, పండికోట్కూరు పోలీసుస్టేషన్

కానిస్టేబులు అగు

**బి. ఆనందము**

రచియింపబడెను

---

బెజవాడ

వాణీ ముద్రాక్షరశాల యందు

ముద్రింపబడినది.

1926.

# ప్రేరణ

క్రైస్తవ సహోదరులారా! పూర్వు
లందరు నిజదేవుని తెల్సుకొనజాలక తమయిష్టము వచ్చినట్లుగా
విగ్రహారాధనలు అధికంబుగా చేయుచుండిరి ఎందుకంటే ఆదా
మవ్వలు తామొనర్చిన దుష్కార్యంబులచే కలిమాయలో బడి
యుండిరి. యిట్టికలి మాయలో పడినవారిని తన స్వాధీనములో
తీసుకొనవలెనని యాపరమాత్ముడెరిగి తానుండుయవతారమున
దర్శనంబిచ్చుట మంచిదికాదని తలంచి తానొక బీదకన్యకగర్భ
ములో యవతారమెత్తి తానెట్లు వీరిని తనస్వాధీనములో తీసు
కున్నది క్రైస్తవవేదమునందు వ్రాయబడియున్నది. అయితే
ఆవేదమును చదివి గ్రహించినవారలు కొందరు వున్నారు. మరి
కొందరు యేమియు తెలియక మొదటిఅభ్యాసమునే నధికముగ
వాడుచున్నారు. అయితే హిందువులు అనగా యీకలియుగ
ములో యుండుకొందరు జ్ఞానవంతులుగా యుండి రాజునంశము
లోజన్మించిన రాములు కృష్ణుడు వీరలు దేవతలనియు వీరలు
తప్ప మరే దేవుడు లేడనియు హిందువుల పురాణమునందు
వ్రాయబడియున్నది. యిందులో కొందరు మహమ్మదీయులుగా
యేర్పడి క్రైస్తవులవేదమును బట్టి కురానును ఒకటిచేయూరు
చేసిరిగాని అయితే ఆపూాదిరిగా నడవక తమయిష్టమువచ్చిన
ట్లుగా నడువప్రయత్నించిరి అయినను వారు చేసినది తప్పుయేమి
యు లేదు. దీనికై నేనొక దృష్టాంతము చెప్పెదను వినుడి. హిం

దువుల పురాణము, తురకల కురానును క్రైస్తవుల వేదమును యీమూడు యీతరములో వ్రాయబడినవి కాదుగాని, పూర్వ కాలములో తయారుచేయబడినవి అందువల్ల మన మాగ్రంథములు నిజమేయని నమ్మవలెనుగాని అబద్ధమనకూడదు. అయితే హిందువుల పురాణము తురకల కురానును యీ రెండునుతర్కించిచూచినట్టులయినా. మనకొరకు తనప్రాణము బలిపెట్టి సమాధికాబడి తిరిగి శరీరముతో బ్రతికిలేచిన దేవుడు కలడని వ్రాసియుండలేదు. కాని క్రైస్తవుల వేదమునందు మాత్రముయున్నది. గానఆమహాత్ముడు మనకొరకు తనప్రాణమును బలిపెట్టియేలాగు తిరిగిలేచెనో ఆవిషయములన్నియు కనుగొనవలెనంటే యీపుస్తకము తెప్పించుకుని చదివిన మీకెల్లరకు తెలియును. అదియునుగాక యీపుస్తకము ప్రతియొక క్రైస్తవుని యింటిలో యుండ తగినదిగాన త్వరపడి రండు.

బి. ఆనందము

పోలీసు కానిస్టేబిల్ నెం. 69.

S. P. G. మిషన్. గోపానిపల్లె, కంభం తాలూకా,

హాల్. నందికొట్కూర్ పోలీసుస్టేషన్.

# క్రీస్తుజనన నాటకము.

రా॥ కమాస్॥ నటి. నటకునిపాట ॥ఆదితా॥

నట—మందగమనజూడవె యీమందిర మానందము సుంద
రాంగియిందుభక్తు లెందరున్నరో జూడుమ ॥మ॥

నటి—నాథజూడడెందము ఆనందమాయెనేటికి యెందు లేదు
యిందుగల మందిరంబును జూడగా ॥నా॥

నట—మరువసాధ్యమాయెనీ మందిరంబు సుందరి పరమతండ్రి
యిందుగలడె నిరతమెప్పుడు జూచినక ॥మ॥

నటి—యిందుగల జనములెల్ల యెందు కేగిరిచటికి సుందరాం
గ డెంద మొంద అందముగ దెల్పుమా ॥నా॥

నట—పణతి వీరలెల్లదైవ ప్రార్థనలుసలుపను జనుదెంచి యు
న్నవారు జనములెల్లజూడుమ ॥మ॥

నటి ॥వ॥ నాథా, వీరందరు యిటురాకారణంబేమి?

నట—॥వ॥ సుందరి వీరందరు మహాభక్తులు. పూర్వకాలంబున ఆదామవ్వలను జన్మింప యేర్పాటుచేసిన శ్రీయెహోవ ఆలయమిదే గాన వీరిడెందంబులు ఆనందమొందించు నాటకమేమున్నదో యెరింగింపుము.

నటి—దేవా! అట్టి మహాత్ముల డెందంబులు ఆనందమొందించుటకు శ్రీయేసుక్రీస్తు ప్రభువు జన్మనాటకము తప్ప మరేనాటకము లేదు.

నట—సుందరి నీపలుకులు వినుటచే నాడెందంబు ఆనందమొం
దెగాన మన యాత్రంబునకుఁ జనుదము రమ్ము.

నటి—బుద్ధి ఆలాగె వెళ్ళుదము రమ్ము.

రా॥ ఝుంఝూ॥ మరియమ్మపాట ॥తా॥ ఛాప్

పరమతండ్రిపలుక వేళను పతితపావన మోదమలర వేడు
దాసనుఁ గాచిబ్రోవుమ ॥ప॥

I మందిరంబుఁజేరిచూడ ఆనందమాయెను సుందరాంగ
నా కన్నులాతో నిన్ నెన్నడుగాంతునో ॥ప॥

II దూతలార బేదగించక దాపుఁజేర్చరె బీదరాలను నాదు
పైన జాలిజూపరె ॥ప॥

III అబ్రహాము ఆశ్రయామనుఁ ఆదరించుమ. అన్యురాల
ను నన్ను గావుము సన్నుతాంగుడ ॥ప॥

వచ— ఆహా యిదేమాశ్చర్యంబని దలంచవలయును. నేనెంత
వేడినను యాపరమాత్ముండు దర్శనంబియ్యకున్నాడు.
యిది నాఅదృష్టమా లేక నాప్రాప్తియా యిందు కేమని
దెలుపవలయును. అయినను యాపరమాత్మకు యెన్ని
యో పనులు గలవు. గాన నాశక్తికొలది యాపరమా
త్మను ధ్యానించుచు యుందునుగాక.

దూత॥వ॥ ఔరా! సర్వస్వతంత్రసంపన్నుడగు యాపరమాత్మ
కొరకై అన్నపానాదులు లేక రాత్రిపగలనక ధ్యానించుచున్న
యీమెభక్తి కేమనవలయును. యిట్టి సంపన్నురాలగుటచే
యాపరమాత్ముడు యీమెగర్భవాసమున జన్మింప ప్రయత్నించె
గాన నేనచటికిజని యీసంగతి నెరిగించెదనుగాక.

దూ—దయసంప్రాప్తురాలా లెమ్ము. నీకు శుభమవునుగాక.

మ—దేవా వందనంబులు.

దూ—దీర్ఘయుష్మ్యరాలవై వర్ధిల్లుము.

మ—దేవా, మీనామధేయంబేమి? మీరిటురా కారణంబేమి?

దూ—అమ్మా! నానామధేయంబు చెప్పెదన్ విను

దూ ॥సీస॥ చెప్పెదవినవమ్మ • నొప్పుగనాపేరు
తప్పుగామదిలోన • దలుపకమ్మా
నరరూపులకువార్త • నిరుపింపవెడలేటి
నిర్మలాత్మ్ముండనినన్ను • దలతురమ్మా
ధన్యురాల గర్భము • దాల్చెదవమ్మ
వినుతిచే సంతోష • మొందుమమ్మా
నీదుగర్భమునందు • నిజ దేవుండు
నుద్భవించు నామాట • నమ్ముమమ్మా
గీ॥ యిట్టిశుభవార్తలు • నుడువవచ్చెటివాడ
భటులకు నేపెద్ద • భటుడనమ్మా
మనమున చింతలు • మానుమమ్మా
ఘనునిరాక కెదిరేగి యుండుమమ్మా.

దూ—వ॥ అమ్మా నాపేరు గాబ్రియేలుదూత యందురు నేనా పరమాత్మ్మని పెద్దభటుడని నన్నే శుభవార్త పరుడని కూడా యందురు. నేనా మహాత్మ్మని యాజ్ఞానుసారముగా తానుచేయదలంచుకున్న కార్యములెల్లను మీవంటి భక్తులకు దెలుపవచ్చువాడ.

మ—॥వ॥ దేవా యామహాత్మ్మ డిట్లు జన్మింపకారణంబేమి!

దూ॥ వ॥ అమ్మా! పూర్వకాలంబున దేవుడు అబ్రహాముకు ఆశీర్వాదమిచ్చునపుడు నీవు మొదలు దావీదు వరకు

పదమూడు తరములుగా జన్మించుచుండురు. అయితే నీవంశములో పుట్టిన యీ జనాదులెల్లను నీవలెనే నాసేవ చేయుచుండిరేని యేమిపరవాలేదు. వారట్లు చేయకపోయిరేని వారిలోయుండు యావత్తు దుర్మార్గకార్యములు నిలిపివేయుటకై నేను పదనాలవ యవతారమెత్తెదనని చెప్పియుండెను. అయితే యీదురాత్ములందరు యీపరమాత్ముని మరచియుండుటచే ఆయన నీగర్భవాసములో , జన్మించుచున్నాఁడు గాన పోయివచ్చెదతల్లీ.

మ॥ దేవా! నేను వివాహము కానిదాననే! నాగర్భములో ఎట్లు జన్మించును?

దూ॥ అమ్మా! వివాహమైనచో వారిరువురు పాపాత్ములైయుందురు. అట్టివారి గర్భములో తానెప్పుడు జన్మించడు. అదియుఁగాక భక్తియందాశగల్గి యీపరమాత్ముని యను దినము ప్రార్థించుచుండు మీవంటివారిగర్భములో జన్మించునుగాని మరింకేమియులేదు. అమ్మా పోయివచ్చెదను.

మ॥ దేవా! పోయిరమ్మా?

రా॥ శహన॥ మరియమ్మపాట. తా॥ చాప్.

ఆహాయిదేమది ఆశ్చర్యమైనది
యీదేవదూత యిటులనాతో పలుకుచున్నదే॥ ॥ ఆ ॥

I. నాదుగర్భము నందుతానపుత్రుడు
సదయత నుదయించుననుచు చాలఁబల్కెను ॥ ఆ ॥

II. పురుషుని యెరుగన్ నేపుట్టినది మొదలు
పరమతండ్రి యెట్లునాకు వరము నంపెను॥ ॥ అ ॥

III. భావమందున యోహాను భక్తుడు
ప్రచురించినట్లుగానె బలుకుచున్నడు॥ ఆ ॥

గీ. నీదునామస్మరణ • జేయు నధములనెల్ల
సదయతగాపాడు • నాడవయ్య
దాపుచేర్చుమునన్ను • దయచేత నిలలోన
గాపాడి బ్రోవుమా • కరుణహృదయా!

వచ—ఔరా! యీలోక దురాత్ములకొరకయి గదా! యాపర మాత్ముడు జన్మింపవలసె, లేదేని యా పరలోకమందు దేవదూతలతో గలసి యానందమొందు చుండెను. గాన యామహాత్ముని గాకకై యెదురుజూచు చుం దునుగాక.

రా॥ శంకరాభరణం॥ యోసేపు పాట. తా॥చాప్

ఔరయీ కలభావమేనుని దలువగవలయున్
కలిమాయొ యిలపూయొ దెలియంగరాదిలన్ ॥ ఔ ॥

I. కానరాదె స్త్రీలనెన్నడు గాననంబున కేగిన మదిన్
వీనవాయిద్యములు బోలిన స్త్రీలుగలరె జగతిలోజూడన్॥

గీ॥ స్త్రీలనమ్మగరాదు • చిత్తచపలులుగ
లోలాత్ములగు వారి • లోతుదెలియగ రాదె
కలిమియెంతుంచిన • కలతజెందె
వలయుతామెప్పులన్ • వలతురయ్యో॥

వచ—ఔరా! యీకాంత సాహసంబునకున్ యేమనవచ్చును.

గీ॥ కన్నులకావరంబున • కానక దేవుని
వన్నెచిన్నెలు బడిమోటి • వనితలార

సన్ను తాంగుని శాపము • జనుదెంచిన వేళ
వన్నె వాసి దుఃఖించెటి • వింతులారా!

వచ— గాన యిట్టి సురాత్మురాలిని వదలి యెచ్చోటికైనను జనుటే యుచితముగదా.

దూ॥వ॥— యోసేప యిటురమ్ము.

యో— దేవా! వందనములు.

దూ— దీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లుము. అదియునుంగాక యింకొక సంగతి చెప్పెదనువినుము,

దూ॥సీ॥ పరమాత్మ దేవుని • వరపుత్రు రాలీమె
ధరకేగివచ్చిన • ధర్మరాలు
నరరూపులకు భక్తి • గరపింపవెడలిన
నిర్మలాత్మురాలీమె • నిజము గినుమ
ముందు దేవునిపూజ • యెందుబోయిన కోరెటి
సదమలాత్మ రాలీమె • సదయతినుమ
దురితంబు లెడబాప • ధరకేగి వచ్చెటి
పరమాత్మకు తల్లి • మరువకయ్యా॥
గీ. పుత్రుండు జన్మించు • పుణ్యశాలికిపుడు
ధాత్రినేల జన్మించె • ధన్యుడతడు
ధాత్రిలోన నెవ్వడు • దనను బోలినవాడు
జన్మించ లేదనుకో • జగముఁలెవడు॥

వచ— అయ్యా! యింకొకసంగతి విన్నవించెదను వినుడి.

తే॥ గీ॥ కార్యసిద్ధుండవై • కార్యంబు కడ తేర్చ
పరమాత్ముడిటునీకు • వరమునంపె

నేరస్తురాలని • దూరంబునకు జనక
పరమాత్మునినమ్మి • యుండుమయ్యా.

వచ— గాన యామహాత్మునిరాకకై యాప్రసన్నురాలి నివిడువక యనుదినము యామెకు కావలసిన వన్నియు సహాయము చేయుచు ఆమెను వదలకయుండుము. యిదే నా యాజ్ఞ.

యో॥వ॥బుద్ధి బోయిరమ్ము. మీయాజ్ఞానుసారముగా యా కార్యము కడతేరువరకు ఆలాగే యుండెదను. (అని) ఔరా! యీకాంత యేకాంతమున వ్రతముకావించి ప్రయాసంబుచే ప్రలాపించుచుండ నదిగానకయే నా యిష్టమువచ్చిన దురాలోచనలు చేయుచుంటిని. యిట్టి సమయంబున సర్వేశ్వరునిదూత ప్రత్యక్షమై చెప్ప తెల్సుకొంటిని. లేదేని నా తెల్వి లేని మూఢత్వముచే యాప్రతివర్దను నిందించుచుంటిని గాన యీ కపటోపాయము వదలి ఆప్రతివర్దను విడువక యుండెదనుగాక.

రా॥ ఫీల్॥ మరియమ్మపాట. తా॥ ఛాప్.

యెంతకష్టముగలి గెనయ్యో యేమిజేతునుహా,
నిదురకంటికి పట్టదయ్యో యేమిచేతునుహా ॥యె॥

I. ఉండయిల్లు లేకపోయెను పండమంచము లేదెహా.
నిండుగర్భముతోడ నేను ఎట్లునుందునెహా ॥యె॥

II. నడుమునొప్పులు అధికమాయెనె నిల్వజాలనుభూమిపై.
కడుపులోన త్రిప్పినట్లు కదలుచున్నదె హా ॥యె॥

తే॥ గీ॥ నీరాకనెరిగింప • నరలోకమునకు
వరదూతనంపిన • పరమజనక

వచ— హా జగద్రక్షకా హా కృపాకర హా పరమేశ్వర నాకేల యీకష్టమొనర్చితివి. నేనెట్లు సహింతును. నిన్నెరుగనిది ఏదియు లేదుగదా. నన్ను కాపాడుము. (అని మిశ్రమించుట.)

గొల్లలు—ప్రీ (అని అరచుట)

గొర్లు—బ్యా. (అని అరచుట)

గొల్లలు—సహోదరురాలా! ప్రొద్దుపోయినది. గొర్లను దొడ్డిలోకి మలుపండి. (అని పరుండుట.)

రా॥ తోడి — దూతపాట. — తా॥ ఏక

యెంతబిల్చిన పలుకకున్న రేలనో యీగొల్లలు
వేళమించినిద్రచెంది అలసియున్నవారెమో ॥యె॥

I. పరమతండ్రిసుతునియెప్పుడు గాంతురెమరిజూతురె
కారణంబుయేమొవారు లేవకున్నవారలె ॥యెం॥

II. పురములో గోపానిపల్లె బుట్టివారి వంశముల ధరణిలో
గాపాడిబ్రోచెటి ధన్యునెరుగకున్నరె ॥ యెం

వచ — ఆహా యిదేమాశ్చర్యంబని దలంపవలయును, వీరలు పగలంతయు యెండగాలికి తిరుగుటచే అన్నము నీళ్ళులేక ప్రాంతకాలమునకు యిచటచేరి స్నానముచేసి భుజించుటచేమితిలేని నిద్రచెందిరి కాబోలు గాన వీరిసమీపమునకుజని లేపెదనుగాక.

దూతా॥వ॥జయోత్సవపరుడు జన్మించె లెండి లెండి. (అని అరచుట)

రా॥ కాంభోజి గొల్లలపాట. తా॥ ఏక॥

అబ్బబ్బయిదియేమి నిబ్బరంబుచాలాదు. బెబ్బులివలె
మన పై బడవస్తుంది ॥అ॥

I. అదిగోవచ్చెచూడండి యిదిగోవచ్చెచూడండి బదిలముగ
మనలబట్టి బక్షించెటట్టుంది ॥అ.

II. యింటిదేవునిదలువండి యీశ్వరునివేడండి నుంటిపైన
ప్రానాలు మల్లించమనియిప్పుడు ॥అ॥

వచ— హా దేవా మేమేమి తప్పునొనర్చితిమో మాకేమి తెలి
యదు. మమ్మాదరించుము.

దూ॥ వ॥ యాదవులారా! యేల భయంబు నొందుచున్నారు.
నేను మిమ్మును భ్రమింగరాలేదుగాని మీకొక శుభ
వార్తను దెచ్చియున్నాను చెప్పెదను వినుడి.

తే॥ గీ॥ గొల్లలార మీరింత • గలసి నాతోడ
వెల్లిపోదము రండి • వేగమిప్పుడు
నేవెళ్ళు స్తలమదే • నరయంగమీకు
భయమేల లేలెండి భక్తులార॥

వచ—యాదవులారా! మీరేల భయపడుచున్నారు. మీకు
లోకరక్షకుడు బెల్లెహేములో జన్మించియున్నాడు గాన
యతి శీఘ్రంబుగా జనుదము రండు.

గొ॥ వ॥ దేవా ఆదేశ్రప్రకారం వచ్చుచున్నాము.

గీ॥ నిజధ్వజప్రసిద్ధ సిద్ధులార
నిజదేవునిపూజ కెళ్ళు • నిష్టలార
తేజరిల్లు మీమహిమ • తెలియనాయనుజూడ
తామసంబు లేనట్టి • ధన్యులార॥

వచ—సర్వశక్తిగల దేవునికృప మీపైకుమ్మరింపబడెగాన దీర్ఘ
శాంతులై నా వెనువెంట జనుడి. అందరము యామహా
త్మునికడకు జనెదము.

రా॥ నవరసకనడ॥ గొల్లలపాట తా॥ ఆది॥

పోదాము వేగముగ బెత్లెహేపురముకు ఘోరారణ్యముదాటి
మనము వేగమెవెళ్లుదము మన ప్రభువుని కడకు॥ పో॥
1 చుక్కవెనువెంట మనమంతయుగలసి మక్కువతో
యా ప్రభునిజేరి చక్కగపూజింతం మన ప్రభుని వేగ॥ పో॥
వచ— సహోదరులారా యిదేనా బెత్లెహేము
మరిఒకడు— కాదు కాదు. అది యూదయ్యదేశము అది దాటి
నచో ఆవల జూతుము. (అని మిశ్రమించుట.)

రా॥ కాంబోజి॥ హేరోదురాజు పాట. తా॥ రూపక

రా— మంత్రివర్యమా మన రాజ్యమందలి జనులు కుశలమే
గద॥ మ॥
మంత్రి— రాజచంద్రమ మన దేశమందలిజనులు కుశలమే దేవ॥ రా॥
సా— స్నానసందెలు దప్పకుండగ బూనుచుందురే భూసురోత్త
ముల్ యానరేసలుధీరులెగద యఖిలసంపద లొందు
చుందురే॥ మం॥
మంత్రి—స్నానసందెయాదిక్రియలుబూనుచున్నరే భూసురోత్త
ముల్ యానరేశలుధీరులేదేవ యఖిలసంపద లొందు
చున్నరే॥ రా॥
రా—వ॥మంత్రీ మన రాజ్యంబుననుండు యావన్మంది యాపర
మాత్ముని యనుదినము ధ్యానించుచున్న వారలేగదా.

మం— వ॥ దేవా మీయాజ్ఞానుసారముగ యావన్మంది యా పరమాత్ముని మరువక ధ్యానించుచున్నవారలే దేవా.

రా—మంత్రి యా మార్గంబున జనువారెవ్వరో యిటు రావించుము.

మ—మంచిది అని ఓ ప్రయాణీకులారా యిటు రండు.

గొల్ల—దేవా వందనంబులు.

మ—మీరు రేదేశస్తులు యేకార్యార్థమై యిటు వెళ్ళుచున్నారు. అది యంతయును సక్రమముగా దెల్పుడీ.

గొ—అయ్యా మేము తూరుసీదోనియులము గడచినరాత్రి మేము పూరబైట గొర్లను ఆపుకొని వాటి సమీపమున పరుండియుండ రాత్రి ప్రకాశమానమైన చుక్క కనుపడె. దాని జూచి మే మందరము భయపడి భ్రమసి క్రిందపడియుండ అందులోమీకు బెత్లెహేముపురములో లోకరక్షకుడు జన్మించియున్నాడు. పోయి దర్శించిరండీ అని యొక శబ్దము పల్కె అందుకై వెళ్ళుచున్నాము. గాన పోయి వచ్చెదము సెలవొసంగుడీ.

రా—మంచిది మీరు ఆలాగే జని యా మహాత్ముని దర్శించి తిరుగా మీ గ్రామాదులకు జనునపుడు నాతో గలసి పోవలసినది. నేను వెళ్ళి దర్శనంబిచ్చి వచ్చెదను యిదే నా యానతి పోయిరండు.

గొల్ల—మంచిది ఆలాగే తెల్పెదము దేవా

రా॥ హిం॥ తోడి॥ గొల్లపాట. తా॥ త్రిపుట॥

యేసునాథానీదునామ స్వరూపము యొందెందుజూచిన

లేదుగదా యెందెందుజూచిన లేదుగదా యీ సత్రిమందుదయిం
చినావుగదా॥ యే॥

I ఆదియందున నీవు ఆదమవ్వలతోడ యేదేనుతోటయం
దెలిసినోడ. మేదెనుతోటయందెలసినోడ యేకభక్తితో వారి
నేలినోడ॥ యే॥

II అడవిలోమేమంత బడలికపడుచుండ దడయకాత్మద్వార
దెల్పితివా వడయకాత్మద్వారదెలిపితివ దాసులకు సిమహిను
జూపితివా॥ యే॥

గో—వ॥ దేవా నిన్ను గాంచుటచే మాజన్మపాపంబులు తొలి
గె మేమెంత ధన్యులమైతిమి. (అని పరుండియుండుట)

దూత—గొల్లలారా మీరు మీగ్రామాదులకు జనునపుడు
యూదయ్యు దేశముమీదుగా యంతమాత్రము జన
కుడి. ప్రక్కగ్రామాదుల మీదుగా జనుడి.

గో—మంచిది దేవా అదేలాగు జనెదము.

హేరోదురాజు దర్బారు.

రా—మంత్రి. మొన్న బెత్లెహేమునకు జనిన యాగొల్లలింత
వరకురాలేదు. కారణంబేమైయుండవచ్చును.

మంత్రి—దేవా అతడొక మహాత్ముడై యుండవచ్చును గాని
మరింకేమియులేదు గాన యింకొక సంగతిచెప్పెదను
వినుడి. మీరు మనసేనా నాయకుడునిబిల్చి. యాగ్రామ
మునకున్ బంపి. యాగ్రామముఃలోయుండు రెండు సంవ
త్సరముల యీడుకు తక్కువనుండు మొగపిల్లల నందర్ని
వధించి రావలసినదిగా వుత్తర్వుగావించితిరేని మీచింత
లెల్లను దీరునుగాన మరింకేమియులేదు.

రా—జోనాను అట్లొనర్చుటే మంచిదని తలంచితి;

రా—సేవకా

సేవ—దేవా

రా—నీవు సేననాయకుని కడకుఁ జని నేనా సేనానాయకుని పిల్చితినని యెరింగింపుము.

సేవ—మంచిది దేవా (అని సేననాయకా రాజుగారు బిల్చిరి.

సేననా—దేవా వందనంబులు

రా—దీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లుము సేనానాయకా నీదండా బలంబుచే యతిశీఘ్రముగా యాబెత్లెహేమునకుంజని యాగ్రామములో యిరుప్రక్క గ్రామాదులలోయుండు రెండు సంవత్సరముల యీడుకు తక్కువగనుండు మొగ బిడ్డల నందరిని నాఖడ్గంబుచే వధించి యతిశీఘ్రముగా రండి యిదే నాయానతి.

సేననా—బుద్ధి అలాగే వెల్లుచున్నాము దేవా.

రా—మంత్రి మనయాత్రంబునకున్ జనుదము రమ్ము

మం—మంచిది ఆలాగె వెళ్ళుదము రండు.

దూ—వ॥ యోసేప లేమ్ము శిశువునుజంప దుర్మార్గులు జనుచున్నారుగాన వారు వచ్చునంతలో యీశిశువునిగొని ఐగుప్తునకుఁ జనుడి యిదే నాయానతి

యో—దేవా అదేప్రకారము వెళ్ళుచున్నాము.

భటు—బెత్లెహేములో యుండు పసిబాలురనందర్ని వధించుట

హేరోదురాజు దర్బారు

రా—మంత్రి మన సైన్యము యింతవరకు రాలేదు. కార్యంబేమై యుండవచ్చును.

మం—దేవా కార్యము సఫలంబుగావించి యానందభరితులై భేరి మృదంగ వాయిద్యంబులచే వచ్చుచున్నారు అదిగో చూడండి.

సేన—దేవా వందనంబులు.

రా—దీర్ఘాయుష్మంతులై వర్థిల్లుదు

సేన—దేవా మీయాజ్ఞానుసారముగా యాకార్యము కడతేర్చి వచ్చితిమి. సెలవొసంగుడి మాయా స్త్రింబునకుకా జనెదము.

రా—మంచిది అలాగె జనుడి. ఆవలచూతము. మంత్రీ మన కింకేసంశయము లేదుగాన మనయా స్త్రంబునకుకా జనుదము రమ్ము.

రా॥ కమాచు॥ యోహాను పాట తా. రూపక

మానుడయ్యా మానుడయ్యా మాయబొమ్మలపూజ మీరు. మనుజమాత్రుడైన దేవుడు జననమెత్తియున్నడయ్యా॥మా

I మారుమనస్సు పొందుడయ్యా మాయలోక భ్రాంతుల్విడచి. ధరణిలోన మిమ్ము దేవుడు దయతో కాపాడునయ్యా॥మా

యో—వ॥ అయ్యో సర్పసంతానములారా రాబోవు యెహోవా శాపము తప్పించుకొనుటకిపుడె ప్రయత్నించుడి. లేదేనినాశనాంతకారులై పోదురు. త్వరపడండి త్వరపడండి.

ప్రభు—అయ్యా నాకు బాప్తీస్మము యివ్వుడి.

యోహా—తండ్రియొక్క కుమారునియొక్క పరిశుద్ధాత్మయొక్క పేరటయిమ్మాను యెలనె పేరు వహించి యాలోకజను

లను యేలుటకై నీకానవాలుగా యీగుర్తువేయుచు
న్నాను, ఆమేన్

వృ దే—యితని నాప్రియకుమారుడు యితనియందు నేనానందిం
చితిని యితనిసత్యము తరతరములుండునుగాక.

యేసుప్రభువు తనశిష్యులతో బయలుదేరి వెళ్ళుచుండ
గా మార్గములో అంధుడు ప్రవర్శనం ఏవుట,

రా॥ హరికాంభోజ గ్రుడ్డివానిపాట. తా॥ ఆది

యిన్నడునినుగాంతునో నాకన్నులలరగ దేవ మన్నించి
బ్రోవరావ మరియమ్మవరపుత్ర ॥యి॥

1. కాననంబున నేను కడు బాధలొందుచుండ కరుణించిబ్రోవరావ
నిరతంబు నిన్నునమ్మ ॥యి॥

వచ— హా జగద్రక్షకా హా కృపాకర హా పరమేశ్వరా యీ
పాపి నేలజన్మింపజేసితివి. యెన్నియో యపరాధములు
చేయుటచేగదా? యీదురవస్తతటస్థించె. యిట్టి నరు
నేలజన్మింపజేసితివి. మన్నె నరకాగ్నిలోవైచి కాల్చ
కూడదా? కాదు కాదు యీదురాత్ముని బరిశ్రమలు
బెట్టవలెనని దలంచియుంటివా నీరాకకెదురేగి చూచు
చున్న యీనీచనరుని రక్షించుటకు నేటికైనను రా
కూడదా హా దైవమా.

ప్రభు—అయ్యా, నేను నీకేమిచేయకోరుచున్నాను.

గ్రుడ్డి— దేవ నేచూపు పొందకోరుచున్నాను.

ప్రభు— సర్వశక్తిగల దేవుడు నాకిచ్చిన తనబాహుబలముచే
నీవు చూపుపొంది యా పరమాత్ముని మరువకుండుము.

రా॥ ఘుంఘ్రూ॥ గ్రుడ్డివానిపాట. తా॥ త్రిపుట
ఆనందమాయె దేవ అర్పింతుకానుకలను అర్పింతుకాను
కలను ప్రార్థింతు దేవనిన్ను ॥ఆ॥
I. కుంటిగ్రుడ్డివారిన్ కుష్ఠరోగులనెల్లన్ కుటిలములు బాగు
జేయ వేంచేసినట్టిప్రభువ ॥ఆ॥
II. పరలోకపురవాస భూలోకమేలెడాతా ధరణిలో మ
మ్ముగనేల నరుడెంచినట్టిప్రభువ ॥ఆ॥
తే॥ గీ॥ నీదుమహిమ గనుపింప యీధరలో నేరికిన్
సాధ్యంబుగాదయ్యె • సదమలాత్మ
విదితముగ నినునమ్మ • సదమలాత్మలనెల్ల
బదిలముగ బ్రోచెటి • పరమజనకా.
వచ— దేవావందనంబులు మీదర్శనంబవుటచే నాజన్మ
పాపంబులు తొలగిపోయెగాన పోయివచ్చెదను. దేవా
ప్రభు॥వ॥మంచిది ఆలాగే వెళ్ళుము.
7దయ్య॥ఓనరజేయుడగు యేసు నీతో మాకేమి? మమ్ము బా
ధించవచ్చితివా.

ప్రభువు అపవాదులపాట

డైలాగ్

ప్ర— వెడలండి వెడలండి వేగమే మీఅతనినుండి విడవజేయ
పనిలేదు విడువుడిమీరతనినిపుడు ॥వె॥
అప—పోయెదముపోయెదము దయనుఉంచుమో ప్రభువపొందు
గను పందులలోకి పోవునట్లు సెలవిమ్ము ॥పో॥
ప్ర— మాటలేలయూడెదరు మాటిమాటికిటులనాతో సాటి
బోల్చ పనిలేదు దాటివెళ్ళుడతనినుండి ॥వె॥

అపవా॥ వందనంబువందనంబు ఓయేసునాధనీకు వెళ్ళిపోవుచున్న వారం మళ్ళిశాపమొసగబోకు ॥పో।

ప్ర॥ వ॥ మాయవాధములారా యేల యింకాప్రేలుచున్నారు. యతిశీఘ్రుంబుగా జనుడి.

అపవా॥ దేవా అటేప్రకారము జనుచున్నాము.

ప్ర— అయ్యా! నీగ్రామమునకున్ జని యాపరమాత్మని యను దినం ప్రార్థించుచుండుము.

యూదులు యాజకుల మంటపము.

యూదు॥అయ్యా యాజకులారా వీనినెట్లుచేయుదము

యాజ॥ అయ్యా వీనికి యేలాగైనను మరణదండన చేయించు టే మంచిది. కాని మరింకేమియు లేదు.

మూదు॥ఔనౌను అట్లుచేయుటేమంచిది కాని అయితే వీరందరు ఒకటె స్వరూపముతోయుండినట్లు కనుపడుచున్నది. గాన వానినెట్లుగుర్తించవలెను.

యూద॥ అయ్యలారా నేను మీకామనుజుని జూపించెదను నాకేమిచ్చెదరు.

యూదు॥ అయ్యా నీవామనుజుని మాకు చూపించితివేని మీకు కావలసినంత ద్రవ్యము నిచ్చెదము గైకొనిడి.

యూద—అట్లయినన్ యింకొకసంగతి చెప్పెదను వినుడి నేనా సలమునకు ముందు జనెదను, ఆవలమీరు రండి నేను యెవని ముద్దుబెట్టుకుందునో వాడే ఆయనని తలంచి వాని పట్టుకొనుడి. యింతే నేవెళ్ళెదను.

యూదు—మంచిది ఆలాగేజనుడి. మేము వచ్చెదము.

## ప్రభువు - శిష్యుల ప్రవేశము.

ప్రభు—భక్తులారా! మీరా యెదురుండు గ్రామమునకు వెళ్ళుచుండ నీళ్ళకావిడి మోయువాడొకడు మీకు యెదురవును. వానితో కలసి నేను నాశిష్యులు పస్కాను భుజించుటకు విడిగది యెక్కడయని ప్రభు వడుగుచున్నాడని వానితో యనుడి. అతడు మీకు ఒకగది చూపించును. మీరా గదిలో పస్కాసిద్ధపర్చుడి.

శిష్యు—దేవా! అదేప్రకారము సిద్ధపర్చెదము.

శిష్యు—దేవా! మీ యాజ్ఞానుసారముగా యావత్తు సిద్ధపర్చియున్నాము.

ప్ర.వ॥—నేడు మనుష్యకుమారుడు మనుజమాత్రుల కప్పగించు సమయము వచ్చియున్నది.

శిష్యు—దేవా! అదేలాగు జరుగును.

ప్రభు—భక్తులారా! యింకొకసంగతి చెప్పెదనువినుడి. మీలో ఒకడు నన్ను యూదులకు పట్టించెదనని యూదులచే కొంత ద్రవ్యము పుచ్చుకున్నాడు. వాడీ లోకములో బ్రతికియుండుటకంటె యెచ్చోటికయినను జని చనిపోవుటయుచితము.

పేతు—దేవా! నేనా! నేనా?

ప్రభు—పేతురు! నేడు కోడికూయక ముందు నన్నెరుగనని బొంకెదవు.

పేతూ—దేవా! అట్లెన్నటికి యన్నృత మాడువాడనుగాను.

ప్రభు—రొట్టెతీసుకొని ప్రార్థించి విరచి దానిని వారికిచ్చి యిది నాశరీరము తినుడి. ద్రాక్షారసమును తీసుకొని ఆశీ

మునైపు కన్నులెత్తిచూచి ప్రార్థించి యిదిత్రాగుడీ. మీకొరకును అనేకులకొరకును చిందించబడిన నానిబంధన యిది త్రాగునప్పుడెల్ల నన్ను జ్ఞాపకము చేసుకొనుటకై చిందించిన నారక్తము (అని యిచ్చుట).

రా॥ జంఝూటి యూదులపాట. తా॥ ఆది,

పట్టరే వీనిని విడువక యిప్పుడె
ప్రభువుననియు దేశమంత పల్కుచున్నవాడు వీడే ॥ ప ॥
I. నాకుమించిన దేవుడు యీలోకములో లేడంచును
నిక్కముగ పలుకుచున్నడు న్యాయము మదివీనికి ॥ ప ॥

యూజ॥ వ॥—సహోదరులారా! యిదే సమయంబు గాన వీనిని వదలకుడి.

రా॥ ఝంఝూ॥ ప్రభువుపాట. తా॥ చాప్

క్రూరులార యేలయిటుల జేరవచ్చితిరి
జారచోరుడకాను నేను నేరమెన్నఏల ॥ క్రూ ॥
I. యేమినేరము జేసియుంటినే నీరజాక్షులారా
నేరమెన్నక భారముల్ మోప న్యాయమవునెమీకు॥ క్రూ
II. ధరణిలో గోపానిపల్లె పురమున్నేన
నామమంటిరి యిటులమీకు వరములొసగినా॥ క్రూ!

తే॥ గీ॥ ఆదాముఅవ్వలు • యేదేనుతోటలో
మోదముతోదైవాజ్ఞ • మీరుటెటులె
వారిసంతతిలోన • వర్తిల్లనవీరి
నేరముల్ బాపుము • నాదుదేవా?

వచ—అయ్యా! అనుదినము మీతో కూడానుండి ఏల యిటు నొనర్చకపోతిరి. కాదు, కాదు, సర్వేశ్వరుని లేకనము

నెరవేరుటకు యీదినము యీ సమయము సమకూడి వచ్చినది. కాబోలు.

చలిమంటవద్దకు పేతూరుజనుట.

యూజ—వీడుసహా వానిశిష్యుడుగా యున్నాడు

పేతూ—కాదు కాదు, ఆయన యెవరో నేనెరుగ

యూదు—వీని రూపముజూడ వానివలెనే యున్నాడు.

పేతూ—అయ్యో! వెలుతురుజూచి నాముఖము చూచుటచే మీకాలాగు కనుపడుచున్నదేకాని నేనాయనను యెరుగను.

యూజ—వీనిమాటలుసహా వానిని బోలియున్నది.

పేతూ—అయ్యా శీతలకాలమగుటచే చలికి నోటివాక్కు ఆలాగువెడలుచున్నది. మరింకేమియులేదు,

కోడి—కొక్కురో కొ (యని కూయుట.)

రా॥ తోడి॥ పేతురు పాట తా॥ ఏక

కటకట నేనెంతపాపకర్ముడైతిని కుటిలభావముచేత ప్రభుని యెరుగనంటినె॥ క॥

I మున్నుదెల్పె ప్రభువునాతో ముదముతోడుత సన్నుతాంగుని మాట నిక్కము సలుపవలసెనె॥ క॥

వచ—హా దైవమా నేనెంత కర్మండనైతి యీ పాపిని కాపాడుము. నీవెరుంగనిదేదియులేదు.

తే॥ గీ॥ కలిమాయలో జిక్కి • కానకినిన్ను
తెలియదంటిని దేవ • తెలివిలేక
గాన యీ యపరాధిని • కరుణతో బ్రోవ
జనువెంచుము నీవు జనక నేడు॥

వచ— దేవా నేనేమి యపరాధమొనర్చితినో నాకె తెలియును. గాన యీ పాపి యపరాధములు మన్నించుము యిదే నా వందనంబులు.

రా॥ కమాసు॥ యిస్కరియోతుపాటఁ తా॥ ఆది

కోపమున ప్రభువునాకు శాపమొసగెనేమిజేతు దాపు జేర్చువారులేరె ధరణిలో నాకుయెవరు॥ కో॥

I పరిశుద్ధప్రభువుని నేను పరులచేతుల కప్పగింప నిరతము నాగలి నేను త్వరితముగనెరుగనైతి॥ కో॥

II యిలలో నేనుబ్రతికియేమి ఫలము లేదుదలచిచూడపరమ తండ్రి శాపమునర్ ధరణిపైనగూల్చివేయు॥ కో॥

రా॥ మోహన.

సీ॥ నాప్రాప్తికేమందు • నెపము నాపై మోపె
యపరాధి విడిపించు • నిపుణులెవరు
జూపమటన్న నే • జూపించితినెగాని
నెపముబెట్టుట నే • నపుడు యెరుగన్
ఉపవాసపరునికి • యపకారమొనరించ
యపవాధులందరు • విపునులైరి
యీ పుణ్యభూమిలోనర్ • గాపాడి బ్రోచెటి
విపున్యులెవ్వరు • కలియరారె
గీ. నడరాని దుష్పథంబుల • నడిచినాడ
ఆడరాని యంద్రుతంబు • ఆడినాడ
యిట్టి వీనిపై శాప • మెట్లు దొలగు
గట్టిగమరణంబు • గలుగునాకు.

వచ—గాన యీ దురాత్ముడనైన నాకు యీ మహాత్ముని శాపము నను బ్రోచును.

తే. గీ. బెత్లెహేమున కేగి • బ్రతుకవచ్చునటన్న
సత్యదేవుని జన్మ • స్థాన మటయె
ఐగుప్తున కేగి విగసిల్లుదమటన్న
భగవంతు శాపంబు • తెగవై చునన్న
పదునాలుఖండముల్ • బరగిజూచినగాని
తలదాచుటకైన నెలవులేదె.

వచ—గాన యిట్టి దురాత్ముడనైన నేను యీ లోకములో యుండుటకంటె యెచ్చోటికైనను జనుట యుచితము గదా (అని మిశ్రమించుట.)

పిలాతురాజు కోర్టు.

రాజు—న్యాయశాస్త్రోపదేశకులారా యీ నిందితు డేమిజేసె.

యూ—దేవా యీనిందితుడు రాజద్రోహమైన కార్యములు జేయుచుండ వీనిని మీయొద్దకు తెచ్చియున్నాము గాన విచారించి నిందితునికి శిక్షవిధించుదురని వేడినాము.

రా—రాజద్రోహమైన కార్యములనగా నేమి?

యూజ—కైసరుకు పన్నులు యివ్వవద్దనియు ఆ రాజుతో మన కేమి పనిలేదనియు తాను దేవుని కుమారుడనియు యెరూషలేము గుడిని పడవేసి మూడు రోజులలో తయారుచేసెదననియు వీధులవెంట తిరుగుచూ బోధించుచున్నాడు. గాన వీనివల్ల అనేకమంది రాజుగారికి తిరుగుబాటు జేసేటట్టుగా యున్నారు గాన మీయొద్దకు తెచ్చితిమి. విచారింప వేడినాము.

రా—అయ్యా కైసరుకు పన్ను యివ్వవలదంటిరా?

ప్రభు—నేనన లేదు నాకు తెలియదు.

రా—మీరు దేవుని కుమారులా?

ప్రభు—ఔను నీవన్నట్టే

రా—వాదులు ప్రతివాదులు ఒకగంట బైటికి జనుడి.

సేవ—దేవా అమ్మగారు వచ్చినారు.

రా—యిటురమ్మని చెప్పుము?

రాణి—దేవా వందనంబులు.

రా—దీర్ఘాయుష్మంతురాలవై వర్తిల్లుము (దేవకి యిటు రాకారణం బేమి.

రాణి—నాథా యీ ప్రసన్నతమొల్లను విరచితముగా చెల్పెదను వినుడి.

సీ॥ ప్రాణనాథ నేనింట • పవ్వళించియుండ
పణతిలెమ్మనియవరో • యనుటవింటి
యిదియేమిటోయని • బదిలముగ నే లేవ
సదమలాత్మునిదూత • యదటనుండె
పరమాత్మ దేవుని • వరపుత్రుని బట్టి
నరులంతకొట్టిరని బలుకుటవింటి
యింతలో మేల్కాని • సంతసంబునచూడ
పతియున్నారు వేరైరి • సతతమచట
గీ॥ భావమెంచిచూడ • భవనిచెంద్రుండు
యనిచెప్పనబద్ధ • మేమిలేదు
గానమీరాయనన్ • కరుణించి విడిచి
పనుదురు పరలోక • జనకునికడకు॥

రా—వ॥ నాథా! యీపరమాత్మ సుతునిపై మనమిట్టి వైరము బెట్టుకొనుట మంచిదిగాదు నామాటవినుము.

గీ॥ పనతినేరాజ్య • భ్రష్టుడనై పోయినన్
వీనిసంహారింపక మానగలనె
భార్యబిడ్డలెల్లను • మరణమొందినగాని
కలికి వీనినిజంపక • మాననెప్పుడు.

గీ॥ కాలసమోహము • గలసివొచ్చిన వేళ
దెలియజెప్పిన వినరు • తెలియబోకరె
యిలలోన నీవు వెలసి • యుండెదననుకున్న
కాలయముడు నినుద్రుంచు వినుము నాథా॥

రా—వ॥ నాథాచెప్పవలసినంత చెప్పితి. వినవైతివి. ఇందు కేమి చేయుదాన వందనంబులు పోయివచ్చెద.

రా—వ॥ సేవకి నా కేమిట్లు వచియించెదవు. అన్నియు నాకు తెలియును. గాన నీనగరంబునకు జనుము అవలచూతము.

రాజు—సేవకా నాదులు ప్రతివాదులను రమ్మని యెరిం గింపుము.

సేవ—బుద్ధి ఆలాగే చెప్పెదను (అని పిల్చుట)

రాజు—యూదకశాస్త్రోపదేశకులారా! యింతకుముందు మన పెద్దలందరు యీపండుగరోజున స్వల్పతప్పితము జేసిన నేరస్తుని విడుచుట వాడుకగద్దుగాన యితనిని విడుచుట మీకున్యాయమైనా.

యూద—అయ్యా వీనికిమారుగా బరబ్బానువదలి వీనికి సిల్వ వేయుడి సిల్వవేయుడి.

రాజు—ఫిర్యాదులు తెచ్చిన యీ కేసు విచారించగా ముద్దా
యి నిందితుడుగా యేర్పడెను గాన యీముద్దాయిని
కపాలమను స్థలమునకు గొనిపోయి సిల్వవేయుడి.

దే॥ దూ॥ గీ॥ యిదియేమి న్యాయంబు • సదమలాత్ముని బట్టి
బదిలముగ శిక్షింప • తగునెమీకు
యితడు పరమాత్ముండు • యిహమునేలను వచ్చె
మతిదప్పినట్టివో • వ్యర్థులారా.

దే॥దూ॥ వ॥ వీరిమూఢత్వమున కేమని దలంచవలయును యీ
పరమాత్ముండెవ్వరయినది వీరల కింతవరకు దెలియదు.
యీమహాత్ముండు యెన్నివిధంబుల ప్రసంగించినను వీరు
తెలుసుకొనజాలక యున్నారు యింక కొన్నిరోజులకునై
నను తెలుసుకొందురేమో కనుగొనియెదనుగాక.

భటు—అయ్యా నడువుడి చాలాదూరము జనవలెను ప్రొద్దు
పోయెను.

రా॥ తోడి॥ ప్రభువు పాట తా॥ యేక.

పోయెద దయగనుడి. నాయెడగల ప్రార్థన మరువకుడి.
హితులనుబాసి నేగతిదీరిపోతినని సతతము మతిదలకుడి నాయెడ
గల ప్రార్థన విడువకుడి ॥పో॥

I నేటికి మూడోదినము నాటిరోజున మీరు సూటిగ
నన్నుజూతురు భవనింద్రియులారా యేటికి దిగులొందుచు
న్నారు. ॥పో॥

గీ॥ లేఖనంనెరవేర్చ • ఢీకొనివెళ్ళేటి
నాకై దుఃఖంబు • నిలుపుడయ్యా

పరమాత్ముఁ డిటునాకు • వరముబంపగ నేను
నరుఁ బెంచుచున్నాను • ధర్ములారా

ప్ర—వ॥ గాన నేను చెప్పిన యీప్రార్థనలు మరువక సలుపు చుండుడి. నేను తిర్గి ఆదివారము వేకువజామున నే వచ్చెదను.

మరి॥ సీ॥ అన్నరో యేసన్న • అనాధరక్షకా
నినుబాసి నేనెట్లు • నుందునన్నా
కఠినాత్ములందరు • కుటిలభావముచేత
నిటుకూల్చ ప్రయత్న • మెతికిరన్నా
నీబోధ వారికి • దుర్బోధగదోచి
నినుజంప ప్రయత్న • మెతికిరన్నా
పాపిగర్భమునసీవు • ప్రసవించినది మొదలు
పడరానియిడుములల • బడితివన్నా॥
గీ. ఇట్టి పుత్రునిబాసి • యెట్లుందువన్న
వొట్టిప్రేమలు బెట్టి • వోరిగితివన్న
మరచియుండమటన్న • మరువరాదన్న
నిన్నుగాపాడు దేవుండు • లేడుగదన్నా॥

ప్రభు॥సీ॥ యూదజనులు నన్ను • బాధపెట్టిరటంచు
మదిలోనదుఃఖంబు • మానుమమ్మా
మిత్రుడై యూదా • శత్రులకు పట్టింప
ధాత్రిలోపుట్టెనని • దలుపకమ్మా
న్యాయాన్యాయముల్ • నెంచకుండ నెశిక్ష
నియమించెనని రాజును • నిందించకమ్మా

మనుజావతారుఁడు • మనుజమాత్రులవల్ల
మరణమొందెనని నీవు • మరువుమమ్మా
గీ. పరులపై నిందలు • వేయకమ్మ
నాపైన భ్రమలింక • మానుమమ్మ
పోయివచ్చెద సెలవిమ్మ • పుణ్యమమ్మ
మరి—గీ. పరమాత్మయనివేడు • నిరుపేదలనుబ్రోవ
నరుడెంచడేలనో పరమతంత్రి
కరుణతోవేడు యీ • కర్మురాలినిబ్రోవ
సరుదెంచిరావె ఓ • ధర్మతంత్రి
వచ—నాయనా యీపాపిరాల గర్భములో జన్మించుటచేగదా యీ పాపిదైవము నీకిట్టి కష్టములొనర్చె హా తనయా నే నెట్లు సహింతును.
ప్ర—వ॥ జననీ నీకొకసంగతి చెప్పెదను వినుము.
కం॥ పరమాత్ముని నిందింప • తరముకాదమ్మ
ధరణిలో మనసుట్టి • ధర్మునెప్పుడు
నరరూపు జననమెత్తి • నరుదెంచినప్పుడె
మరణమే స్థిరమని • నమ్ముమమ్మా.
వచ—జనని యిదిమాయలోకము మనము యేలాగు జన్మింప బడితిమంటే పరమాత్ముడు మనల మంటిచే సృజించినాడు గనుక తిరిగి యీ మంటిబొమ్మ భూమిలో చేరవలసినదే కాని ఆకాశమునకు బోవ శక్తిలేదుగనుక యిందుకేల దుఃఖించెదవు దుఃఖంబు మానుము.
మరి—గీ. కర మాయలోజిక్కి • కలతచెంది
తల్లడిల్లగజేసిరే • తనయునిన్ను

అలరొప్పు నీముద్దు • యలరేని పల్కులు
వినవొల్లనైరిగ • తులువలెల్లా.

వచ—అన్నా! వీరికేమి యపకారమొనర్చియుంటివి యీ దురాత్ములందరు నిన్ను బరిశ్రమలు బెట్టతలచిరిగదా నే నెట్లుసహింతును. హాదైవమా నీవుదప్ప మాకెవ్వరులేరు.

ప్రభు—వ॥ జనని నేనొకసంగతి చెప్పెదను వినుము.

ప్రభు—గీ. తల్లిరోనినుబాసి • తొలగిపోవునటివేళ
గలసివచ్చెదనినీవు • దలువుమమ్మ
పరమాత్మ దేవుని • వరపుత్రునిబట్టి
ధరపైనసగూల్తురని • వెరువకమ్మ.

వచ—జనని మనమందరము యీపరమాత్ముని లేఖనం నెరవేర్ప వొచ్చితిమేకాని మరింకేమియులేదు. అదియునుగాక యీ లోకదురాత్ముల కన్నులకు ప్రదర్శనంబవుటకు నే జననమెత్తితి నేగాని మరింకేమియులేదు.

మరి—గీ. అన్నరోనినుబాసి • యున్నదానకు కానె
నన్నువిడచిపోయెదవ • చిన్నతనయ
యెన్ని యాపదలొందిన • నిన్నువిడనాడక
యున్నట్టిదాసనె • కన్నకొడుక.

వచ—నాయనా నన్ను విడనాడి పోయెదవా నేనెట్లు సహింతును. హా తనయ.

ప్రభు—కం. పుట్టింపరెగిట్టింపను
రెట్టింపనుసమర్థ్యుడైన • శ్రీమంతుడతడు
అట్టివాడుమనల • యెట్టివేళలోబిల్చిన
గట్టిగవెళ్ళుటెఘనము • మనకమ్మా.

వచ—జనని చంపను ప్రతికించను శక్తిగలిగిన యీ పరమాత్ముడు మనల యెట్టివేళలో బిల్చిన వెళ్ళవలెను. అదియును గాక మనమిచట యెన్ని దినములుండినను యీ పరలోకమునకు జనవలసినదే కాని యీలోకములో యుండువారము కాముగాన సెలవొసంగుము. జననిపోయివచ్చెదను.

మ—వ. నాయనా పోయెదవా హా తనయా హా కుమారా.

రా॥ శహాన మరియమ్మ ద్విపదము. తా॥ ఆది

పోవుచున్నారె నాసుతుని సిల్వ వేయనుగొని పోవుచున్నారె యీరాజభటులు.. వేగమెగొని బోవుచున్నారె॥

I. యేమియెరుంగడె పరమాత్మసుతుడు నేరములేవి లేమియెరుంగరె కరుణలేకపిరలెల్ల కపటమునటులగొని॥పో॥

గీ॥ అన్నరారయనిన • యధిక ప్రేమతో బిల్వ
నను జేరవత్తురే చిన్నితనయ
కన్నతల్లికడుపు • కడకు కాల్చియుసీవు
కటకట పోయెదవ • కన్నకొడుక.

వచ— హా జగద్రక్షకా హా కృపాకర హా పరమేశ్వర సర్వము నీకుదెలియును నీవులేనిది ఏదియును జరుగనేరదు. మహాత్మాదరించుము.

భటు—ప్రభువును కపాలమనెస్థలములో నిల్వబెట్టి తలకు ముండ్లకిరీటము వేసి చేతులకు పాదములకు చీలలుకొట్టి సిల్వ వేయుట.

ప్రభు—నాదేవ. నాదేవ. నన్నెందుకు చెయ్యి విడిచితివి. నా ప్రాణము నీకప్పగించుచున్నాను. ఆమెన్.

యోసే:—రాజుగారు నాప్రభువు దేహమునునా కిచ్చుటకు పుత్ర

ర్వ దయచేయుడి నేగొనిపోయెదను.

రాజు—భటులారా యీపోతివిషమును యీమనుజుని కిచ్చి వేయుడి.

భటు—మంచిది ఆలాగే యిచ్చెదము దేవా. (అని ఇచ్చివేయుట)

యోసె॥ ప్రభువును తీసుకొనివెళ్ళి సమాధిలో వుంచుట.

రా॥ నాథనామక్రియ మరియమ్మపాట. తా॥ ఛాపు

అయ్యయ్యో చేయలార తనయుడెందు లేడె యివ్వరుగొని పోయిరో యెందెతికినగనుపడడే ॥అ॥

I. యేక్రూరకర్ముడో ప్రభునెత్తుకపోయినాడె చేరిచూడ లేడె యెందెతికిన నగుపడడె ॥అ॥

II. వాసిగగోపానిపల్లె దీనినిసాక్షిలేడె వేషధారుడెవడో ప్రభునెత్తుకపోయినాడె. ॥అయ్యో॥

గీ॥ యేడినాతనయుండు • యేడినా వరపుత్రు
డేడినాముద్దులయ్య • యీడలేడె
యేడవెతకినజాడ • నేమ తెలియగరాదె
యేమిజేయుదాననే • యమ్మలారా.

వచ—హా దైవమా నేనేమిజేయుదు. నాప్రభు నెవరో గొని పోయిరె. (అని ఆతోటవద్ద యెవరో యున్నారు. అందుజని విచారించెదనుగాక. అయ్యా యీసమాధిలో యుండిన నాప్రభువు దేహము నెవరైనా గొనిపోవుట చూచితివా.

ప్రభు—గీ॥ అడుగమ్మ నీప్రభువు యిడుమలుబడబోకు
వడిగాను లేచెను • దడయకమ్మ
సదమలాత్ముడై తండ్రి • విదితంబుగ ఘలేవ
జనుదెంచుచున్నాడు • జననిప్రభువు

వచ—అమ్మా యింకొకసంగతి చెప్పెదను విను

సీ॥ గలిలయ్యలో ప్రభువు • గలసిమీతోడ
చెప్పినట్టిసంగతి • తెలియ వేద
అందుకై దేవుడు అధికశ్రద్ధతోడుగ
నెళ్ళుచున్నాడడుగమ్మ వెలది ప్రభుని.

వచ—అమ్మా ఆయన మీతో కూడా గలిలయ్యలో చెప్పిన సంగతి యింతలోనే మరచితివా ఆయన మీతో చెప్పిన ప్రకారం యేసుమహాత్ముడు నేడేకువజామున నే మరణము ను జయించి తిరిగి లేచియున్నాడు గానసీవతిశీఘ్రముంబుగా నాకూపుమనకు జనుము యేసుమహాత్ముండు దర్శనం బిమ్ముచుగాన అతిశీఘ్రముంబుగాజనుము తల్లి (అని మాయ మైపోవుట)

మరి॥వ॥ఆహా యితడెవ్వడై యుండవచ్చును. యీయనయేనా ప్రభు వై యుండవచ్చును. గాన యేసుమహాత్మునికడకు జనెద నుగాక. (అనిమిశ్రమించుట)

మరి॥వ॥అయ్యలారా ప్రభువు లేచియున్నాడు. నేను యేసుమహా త్మునితో మాట్లాడినాను. (అని అనుట)

శిష్యు॥ ధర్మమేజయమన్న • ధర్మనందనుండు
ధరకేగివచ్చెన • ధర్మరాలా
వసులకై ప్రాణంబు • బలిపెట్టినప్రభువు
నరుదెంచివచ్చెన • సరతమిపుడు.

వచ—అమ్మా యేసుపరమాత్ముడు లేచియున్నాడ?

మరి॥వ॥ ఔనయ్యా నిజముగా లేచినాడు.

ప్రభు—ఆర్యవరులారా మీకుశుభమౌనుగాక.

శిష్యు॥ దేవా నినుగాంచుటచే మాపాపంబులుతొలగె మేమెంత ధన్యులమైతిమి.

ప్రభు— నేనిప్పుడు మీతో కలసిమెలసియుండి మాట్లాడసమయంబు లేదు. నేనుతండ్రియొద్దకు వెళ్లుచున్నాను. నేనుపోయి మీకు ఆదరణకర్తయైన పరిశుద్ధాత్మను పంపెదను. ఆపరిశుద్ధాత్మను మీరు యేమిజేయవలసినది వివరముగా దెలుపుచు మీతో కలసి మెలసి యుండును. ఆపరిశుద్ధాత్మను మీరు ఆకర్షించుకొనియుంటిరేని మీరు పరలోకమందు నాతోకూడ యుందురు. లేదేని మీరు నాకు దూరస్థులైయుందురుగాన యిదే నాకడపటి దర్శనము.

రా॥ బేహాగ్ శిష్యులపాట తా॥ ఏక

శ్రీకరాకారము మముబ్రోవుమయ్యా నీకుశరణాగతులమైతిమయ్యా ప్రాకారనందితపరమదయాళో దీనకటాక్షము మముబ్రోవుమయ్యా నీకు శరణాగతులమైతిమయ్యా ॥శ్రీ॥

I. మృత్యునుజెయించినావా యీధాత్రిని కాపాడినావా సత్యుడనీకన్న సదమలాత్ముడు లేడే సతతము మము బ్రోవుమయ్యా నీకు శరణాగతులమైతిమయ్యా ॥శ్రీ॥

వచ— దేవా నినుగాంచుటచే మాజన్మపాపంబు తొలగిపోయెగాన వందనమ్ములు పోయిరమ్మ.

రా॥ కమాసు మంగళహారతి. తా॥ రూపక

మంగళమని మంగళమని మంగళమనరె మంగళమని పాడరె శ్రీయేసునాధునికి ॥మం॥

I. వేదశాస్త్రిమెరుగనట్టి యూదజనులలో బాధపొంది తిరిగిలేచిన ప్రభుయేసునకు ॥మం॥

II. ధరణిలో గోపానిపల్లెపురముసందున వరముగొసగి బ్రోచినట్టి మోహనసతీనయునకు ॥మ॥

సమాప్తము